# శ్రీ భక్తవత్సల శతకము.

ఇయ్యది

బందరు, శివగంగ మహిషాసురమర్దనీసేవాతత్పరులగు

బ్రహ్మశ్రీ కుందుర్తి ఆదినారాయణశర్మగారిచే

రచియింపబడి

బ్రహ్మశ్రీ నాదెళ్ల పురుషోత్తమకవిగారిచే

పరిష్కరింపబడి

ప్రథమ ముద్రణము : 1,000 ప్రతులు

బెజవాడ వాస్తవ్యులు, శ్రీయుతులు

మనికొండ వెంకట నరశింహాంశ్రేష్ఠి,

బయన శోభనాద్రి శ్రేష్ఠి

గార్ల ద్రవ్యసహాయముచే

బెజవాడ : ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1935.

శ్రీరామ.



శ్రీ

# భక్తవత్సల శతకము.

ఉ॥ శ్రీకరపార్వతీతనయు ♦ శిష్టపదంబుల నెవ్వఁడేనియుం
శోకఁదలంప నాతనికి ♦ సొంపుగఁ గల్గుఁ జిరాయురున్నతుల్
చేకుఱుగాత నా కటుల ♦ జెన్నగు వాక్యసరిత్ప్రవాహముల్
ప్రాకఁలునంకరించుగతి ♦ బ్రస్తుతి జేసెద భక్తవత్సలా!

చ॥ నిజముగ నెల్లకార్యములు ♦ నేర్పుగ జేయుదు విఘ్నరాజ యో
గజముఖ పార్వతీతనయ ♦ గౌరవమొప్పగ నీకు మ్రొక్కితిన్
సుజనులు మెచ్చురీతిగను ♦ శోభిలజేయుము నాదుకావ్యమున్
విజయమొసంగు వేగముగ ♦ వేడితి నిన్ను నె భక్తవత్సలా ! ౨

ఉ॥ చుక్కలరేడె మోమగుచు ♦ శోభిల గేలను వీణమీటుచున్
మక్కువ పుస్తకంబు మణి♦మాలికయున్ ధరియించుతల్లికిన్
చక్కనియంచరౌతు గొను ♦ సాధ్వికి నాశ్రితకల్పవల్లికిన్
మ్రొక్కెద శారదాంబకును ♦ మోదము నందగ భక్తవత్సలా ! 3

ఉ॥ బంగరుపెట శోభిలగ ♦ బాగుగ వీణధరించి యింపుగా
మంగళగీతముల్ వరుస ♦ మానక మీటుచు మేళగించి యే
భంగములేక రాగములు ♦ పాడుచు నుంటివి తల్లి శారదా
మంగళదాయినీ యిపుడు ♦ మమ్ము సుఖింప నొనర్పు భారతీ! ౪

ఉ॥ బాలశశాంకశేఖర కృపాబ్ధి జటాధర భస్మలేపనా
శూలి దిగంబరా సుమణిశోభితకుండల సర్వభూషణా
కాలహరా పురారి జితకామ మహామహ నీలకంఠ రా
వేల యశోవిశాల స్తుతియించెద శంకర భక్తవత్సలా! ౫

—♦ కవిరాజ విరాజితము ♦—

శరణిదె పార్వతి శంభుకుటుంబిని ♦ చారునితంబిని కంబుగళా
శరణిదె విద్రుమబింబఫలాధరి ♦ చక్రిసహోదరి పీనకుచా
శరణిదె శాంకరి సాధువశంకరి ♦ శత్రుభయంకరి మానిసుతా
శరణిదె శుంభనిశుంభనిషూదిని ♦ సత్యవినోదిని ప్రోవు మముణ్.

చ॥ తనరెడుప్రాసలు న్యతులు ♦ తద్గణలక్షణ మే మెరుంగకే
విను మని వ్రాసినాడ నొగి ♦ వీనుల కింపుగ నుండకుండునో
యనయము నన్ను బ్రోతు వని ♦ యాస బఠించెద నూరుపద్యముల్
తనిసి ననుం గృపం గనుమి ♦ తప్పుల నెంచక భక్తవత్సలా! ౭

ఉ॥ శరణు గిరీంద్రజారమణ ♦ చంద్రకళాధర కాలకంధరా
శరణు విధాతృవిష్ణుముఖ ♦ సన్నుత భద్రఫలప్రదాయకా
శరణని పల్కుచుంటిని భుజంగవిభూషణ దీనపోషణా
శరణు మహాత్మ హేమగిరిచాప మహేశ్వర భక్తవత్సలా! ౮

ఉ॥ రాముడె తల్లిదండ్రి రఘురాముడు నాయిలవేల్పు జానకీ
రాముడు నాకు దిక్కు జయరాముడు శాశ్వతబంధుమిత్రుడున్
రాముడె సర్వలోకములు ♦ రక్షణజేయుచు నుండు నంచు నా
రాముని నిన్ను జెప్పికొని ♦ ప్రాంజలి జేసెద భక్తవత్సలా! ౯

చ॥ అభయము నిచ్చి గాచితివి ♦ యాదవబాలుర గోగణంబులం
ద్రిభువనమూర్తి సీమహిమ ♦ దెల్పగలేని నరుండ నే గదా
యిభవరదా సుధారసము ♦ నే వెదజల్లి మదీయవాక్కులన్
శుభముల జేసి నామదిని ♦ శోభిలుచుండవె భక్తవత్సలా! ౧౦

ఉ॥ చిన్నెలు వన్నెలుం గలుగ • జిందులు ద్రొక్కుచు నున్న కృష్ణ యా
పన్నుడ జ్ఞానహీనుడను • భావనమూర్తి న నే మొనర్తు నీ
కన్న మరెవ్వ రింక నను • గావగవచ్చెద రెప్పుడైన నం
దిన్నగ దీర్ప ని న్దలతు • దేవగణాధిప భక్తవత్సలా! ౧౧

ఉ॥ ఏమియు ద్రోవ గన్పడదె • యీజగమందున నిన్ను జూడ నిం
కేమి యొనర్తు నే నెచటి • కేగగనుందు దయాసముద్ర న
న్నే మెవ రన్న నప్పలుకు • నీదని చెప్పుచునుందు లోకమం
దేమి భయంబు లేదనుచు • నే మదిదోషగ భక్తవత్సలా! ౧౨

ఉ॥ కన్నసుతుండ నన్దయను • గన్నుల జూడవె కామసంహారా
సన్నుతిజేయుచున్న నను • జాలము సేయక ప్రోవు మందుగా
యన్నియు నీవె యంచు మది • నందముగా భజియించుచుందు నో
పన్నగభూషణుండ నను • పాలనచేయుము భక్తవత్సలా! ౧౩

చ॥ మురళిని మోవియందు నిడి • ముద్దులు గుల్కగ నూదుచుండగా
శిరమున పింఛ మెంతయు వి•చిత్రము తోపగ నాట్యమాడ నీ
కరమున దాల్చినట్టి ఘన•కంకణముల్ ధ్వనిచేయుచుండగా
మురహర నిన్ను జూచి కడు • మోదము నొందుదు భక్తవత్సలా!

ఉ॥ రాముడ వంచు ని న్దలతు • రాగదవోయి మదీయచిత్త మం
దేమరకుండ నుండ గరు•ణింపు సురార్చిత దీనపోషకా
కోమలగాత్ర ని న్నెపుడు • కోరుచునుంటి బరాకుమాను నా
స్వామి వటంచు నమ్మితిని • జక్కగ బ్రోవుము భక్తవత్సలా! ౧౫

చ॥ ఎవరు ప్రదోషకాలమున • నీశ్వరపూజ యొనర్పకుందురో
యెవరు విశిష్టభక్తి గిరి•జేశనమస్కృతు లాచరింపరో
యెవరు నిరంతరంబు పర•మేశ్వరుసత్కథ లాలకింపరో
భువి నతిమూఢభావమున • బుట్టుచు రట్టెరు భక్తవత్సలా! ౧౬

చ॥ సలలిత గోఘృతాద్యములు • శర్కరమిశ్రితభక్ష్యభోజ్యముల్
ఫలములు కందమూలములు • పాయసముల్ కలమాన్నసూపసు

స్థలగుహాశాకపాళియును ♦ సత్వగుణోద్ధరణోపహారముల్
వెలయ నొసంగి కప్పురపు ♦ వీటిక నిత్తును భక్తవత్సలా! ౧౭

ఉ॥ ఎవ్వనిరాజసంబున సృ♦జించునొ యీజగముల్ విధాత తా
నెవ్వనిసాత్వికంబున ర♦మేశుడు పోషణజేయుచుండునో
యెవ్వరితామసాన నుద♦యించిన రుద్రుడు సంహరించునో
యెవ్వ డచింత్యు డట్టి పర♦మేశ్వరుగొల్చెద భక్తవత్సలా! ౧౮

ఉ॥ భాసురశాంతిదాంతిభయ♦భక్తులతో నెనరైన మాఘమా
సాసితపక్షమందలి మ♦హాశివరాత్రిని ముందు నెక్క-సా
వాసరవేళలందు నుప♦వాసము జాగరణంబొనర్చి నో
దాసులు గొంతు రెల్లపుడు ♦ తప్పక మోక్షము భక్తవత్సలా! ౧౯

ఉ॥ వాసవవందితుండ వని ♦ వర్ణనచేయుచు నుందు రెల్లరుం
భాసురమైన నీచరణ♦పంకజముల్ గతియంచు నమ్మినం
గోసలదేశ మేలుచును ♦ గొల్చెడిదాసుల నేలుచుందు వే
యాసను నిన్ను నే నిచట ♦ నాడుచు పాడుచు భక్తవత్సలా!

ఉ॥ తల్లివి నీవె యంచు మఱి ♦ తండ్రివి నీవె యటంచు నమ్మి నా
యుల్లమునందు ని స్తలచు ♦ చుంటిని వేడుకతోడ నెప్పుడుం
జల్లనిచూపులన్ని వెద♦జల్లుము నాపయి వేడ్క మీరగా
గల్లలుగావు నన్నిపుడు ♦ గట్టిగ బ్రోవుము భక్తవత్సలా! ౨౧

ఉ॥ యేలరయో బల్కకుంటి విక ♦ నేటికి నాపయి కోపమేలగా
జాలముజేయబోకు మని ♦ చక్కగ వేడుచు నుందు రాఘవా
మూలము నీవె యంచు కడు ♦ మోదముతో నిను వేడుచున్న నం
బాలనజేయు మం చిపుడు ♦ బల్కుచు నుంటిని భక్తవత్సలా!

ఉ॥ శంకలుచేయబోకు మని ♦ శర్వుడ నిన్ శరణంబు వొచ్చి నీ
యంకము జేరు గోరి నిపు ♦ డందముగా భజియించుచుంటి నీ
వంకకు జేర్చుకొమ్మనుచు ♦ నందనముల్ పొసరించుచున్న నన్
పొంకముగా భరింపు మని ♦ పొందుగ బల్కెద భక్తవత్సలా!

చ॥ అనయము మీ యెన్నిజన్మముల ♦ నందగవచ్చెను నాదు దేహమే
మనదగు వాసుదేవ హరి ♦ యచ్యుత కృష్ణ ముకుంద శ్రీహరీ
ఘనమగు నీపదద్వయము ♦ గానగ నిచ్చి జనించె నిప్పుడే
వినదగుగాన బాధలను ♦ వేగమె బాపుము భక్తవత్సలా! ౧౪

ఉ॥ కర్మముచేత గట్టువడి ♦ కానక మున్నుచు వచ్చుచున్న యీ
దుర్మతినైన నే నిపుడు ♦ దొడ్డదియైన పక్షంబు జేరగా
మర్మము దెల్పుమంచు నిను ♦ మాధవ నేశరణంటిగా యికన్
ధర్మముగాదె రక్షణయు ♦ దాసుని బ్రోవగ భక్తవత్సలా! ౧౫

ఉ॥ ఎప్పుడు నొప్పుగా దలచు ♦ చేమరకుండగ నీదుచిత్తమం
దెప్పుడు కంటువో యపుడు ♦ దీనత నొంద కొకప్పుడైన నన్
మెప్పుగ జేయు నిర్ధరను ♦ మేలొనగూర్చుచు దప్పకుండ నా
తప్పుల నెంచవద్దనిదె ♦ దాశరథీ హరి భక్తవత్సలా! ౧౬

చ॥ భరతుడు తాల్చి చామరము ♦ భక్తిని వీచెడి నీదుతమ్ముడై
నిరతము నీదుసేవలను ♦ నేర్పుగ జేయుచు వాయుపుత్రుడున్
వరమునను లుండ లక్ష్మణుడు ♦ వాసిగ ఛత్రముపట్టు సీతతో
సరగున గొల్వు దీర్చి నను ♦ జక్కగ బ్రోవుము భక్తవత్సలా! ౧౭

ఉ॥ మానవతుల్ వరాన్వయలు ♦ మాధవదర్శనకాంక్ష గోపికల్
వేనకువేలు మైమఱచి ♦ పేడిరి భర్తల గౌగిలింతలన్
గానము జేయుచుండు నిను ♦ గన్గొనరాగ నిశీథవేళ సు
జ్ఞానమొసంగి బ్రోచితివి ♦ జ్ఞానసుధాకర భక్తవత్సలా! ౧౮

చ॥ బుధులకు నాకపేందులకు ♦ పూతజనాళికి భక్తకోటికిన్
మధురముగా రుచించెడిని ♦ మాధవ నీదగు నామమంచు నీ
విధమున జెప్పుచుండినను ♦ వేదములున్ స్మృతిధర్మశాస్త్రముల్
నిధు లని నమ్మనైతి నను ♦ నేవిధి గాచెదో భక్తవత్సలా! ౧౯

ఉ॥ వింటిని రక్షకుండ వని ♦ వేమరు నీవని పాడుచుంటి నే
నెంటికి దూరమైతి నని ♦ రేబవలున్ మది కుందుచుంటి నన్

గంటికి రెప్పవోలె నిక ♦ గాపుమటంటి ని కేమ నంటి నే
గంటిని సర్వలోకశుభ♦కల్పనరూపను భక్తవత్సలా! ౩౦

చ॥ సరసుడ వంటి ని న్నెపుడు ♦ సన్నుతిజేయుచు నుంటి గంటివా
శర ణని నిన్నె యంటి నిటు ♦ సాయముచేయగ గోరుచుంటి నే
గరములు మోడ్చి మ్రొక్కుచును♦ గన్నుల జూడగ రమ్మటంటి కే
మరచితివంటి చిత్తమున ♦ మాధవ బ్రోవవె భక్తవత్సలా! ౩౧

ఉ॥ ఏమన నీజగత్త్రయము ♦ నెట్లుగ నీదగు కుక్షియందు నే
ప్రేమను దాల్చినావొ నిరు♦పేదల జూడగ నేనె యుం చిలన్
రామ యటన్న మానవుని ♦ రక్షణసేతు వటంచు వింటి నే
వేమరు వాసుదేవ నిను ♦ వేడుచునుంటిని భక్తవత్సలా! ౩౨

ఉ॥ కన్నుల గాంచగల్గుదునొ ♦ కానకయుందునొ యెన్నడైన నిన్
బన్నగ బుణ్యమూర్తిని కృ♦పామతి నిన్ రణశాలినిన్ హరీ
నిన్నునె కన్నతండ్రి యిక ♦ నైనను నాదగు జన్మమందు ము
న్నెన్నడొ చేయు పుణ్యమున ♦ యేర్పడునా యిది భక్తవత్సలా! ౩౩

ఉ॥ గౌతమియందు మున్గగనె ♦ కంటిని నీదగు దేవళంబులన్
భూతదయాంతరంగ ఫణి♦భూషణ శోభితకోటిలింగ నా
పాతకముల్ హరించెగద ♦ బాగుగ నిర్మలతం బ్రకాశిలన్
భూతలమందు గంటి పర ♦ పుణ్యమొనర్పకె భక్తవత్సలా! ౩౪

ఉ॥ శ్రీగురుదేవ హేళనము ♦ జేయగరాదు పురాణవేదశా
స్త్రాగమధర్మముల్ విడువ♦రాదు మహాసురరాజదేవతా
జ్ఞాగతిమీరరా దొగి మృ♦షల్వచియింపగరాదు నిత్య మ
భ్యాగతపూజమాని కుడు♦వంజన దెన్నగ భక్తవత్సలా! ౩౫

ఉ॥ మింటను సిద్ధచారణులు ♦ మేదినియందు మనుష్యులు న్విని
ష్కంటకపుణ్యమూర్తి వని ♦ గానముసేయుచు నుందురయ్య ము
క్కంటికిసాటి ే రనుచు ♦ గ్రక్కునబల్కెద రెల్లవారు జే
గంటల కైవడిం బాగడు ♦ చుందురు నిన్నును భక్తవత్సలా! ౩౬

చ॥ మురహర నీవు నా కెపుడు ♦ ముద్దులు గుల్కెడుమోముజూపవా
మఱువను నిన్ను నే నెపుడు ♦ మాధవ నీదగు నామమంత్రముం
గరములు మోడ్చి ని న్నెపుడు ♦ గందునటంచు దలంతు రాఘవా
పరమ కృపాకరా నినుసె ♦ బాగుగ నిమ్మతి భ క్తవత్సలా! ౩౭

ఉ॥ చేసితి దానధర్మములు ♦ చేసితి తీర్థజలావగాహముల్
చేసితి సువ్రతంబులును ♦ చేసితి నీదగు పూజ లెప్పుడున్
జేసితి సర్వయాత్రలును ♦ జేసితి నట్టులె పాపకృత్యముల్
జేసితి నొప్పుకొంటి నను ♦ జేయు క్షమాపణ భ క్తవత్సలా. ౩౮

చ॥ కమలభవుండు సారథిగ ♦ గాంచన శై లము కార్ముకంబుగా
క్షమయ రథంబుగా ధరణి ♦ చంద్రులు చక్రయుగంబుగాగ వే
దములు తురంగమంబులుగ ♦ దానవవై రి శరంబుగా భుజం
గమపతి మౌర్విగా దగు మృ♦గాంకధరా శివ భక్తవత్సలా! ౩౯

ఉ॥ రెంటికిబంటు నీకొడుకు ♦ రేబవలున్ మము వెంటనంటి మా
చంటిని బట్టె యొంటరిగ ♦ జంటగ నుంద మటంచు వింటివా
యింటికి రమ్మటంచు పడ ♦ కింటిని జూపె యశోద చెప్పవే
కొంటెగుణంబు మాను మని ♦ గోపిక లందురు భ క్తవత్సలా! ౪౦

ఉ॥ వింటి న శేషధర్మములు ♦ వింటి న శేషపురాణసంహితల్
వింటిని పూర్వరాజుల ప♦విత్రచరిత్రము లార్యవృ త్తముల్
వింటిని విష్ణుసత్కథలు ♦ వీనుల విందుగ నింక నాకు ము
క్కంటి చరిత్రముల్ వినగ ♦ గౌతుకమయ్యెడు భ క్తవత్సలా! ౪౧

ఉ॥ ఎప్పుడు కాశికిం జనుదు ♦ నెప్పుడు గాంచెద విశ్వనాథు నే
నెప్పుడు భై రవేశ్వరుని ♦ నింపుగ మ్రొక్కుదు నిండువేడ్కతో
నెప్పుడు గాంగతోయముల ♦ నిమ్ముగ దోగుదు నంచు భ క్తితో
నెప్పుడు బల్కు మానవుల ♦ నే భజియింతును భ క్తవత్సలా! ౪౨

ఉ॥ సుందరమూ ర్తి లోకములు ♦ సొంపుగదాల్తువు కుక్షియందు వా
నిం దయతోడ గంద కడు ♦ నేర్పుగ నీమహిమం బెఱుంగ నే

గోవలమందకుండగను ♦ గోపకుమారుల గాచి యుంటిగా
కందుకమట్టు లాగిరిని ♦ గాదె వహించితి భక్తవత్సలా! ౪౩

ఉ॥ చంచలమైన మనస్సు హరి♦చింతనజేయక దుర్గుణంబులే
మంచి నటంచు చేర్చుకొనుచు ♦ మానవుగా యిది పూర్వసంచిత
మ్మంచిది యట్లు కన్గొనగ ♦ న్యాయమొ మాయయొ నీప్రభావమో
కాంచగజెప్పుమంటి నిను ♦ గాదయ శ్రీహరి భక్తవత్సలా! ౪౪

ఉ॥ రాగలవంచు దాగిన వి♦రాగికినైనను యోగికైననున్
భోగికినైన జోగికిని ♦ భూతలమందున హాసివృద్ధు లే
త్యాగికినైన తప్పదుగ♦దా హరి నీదగు మాయచేత నే
కాగలదంచు నీకృపను ♦ గావవె ధన్యుడ భక్తవత్సలా! ౪౫

ఉ॥ పాహి ముకుంద నందవర♦బాలక యంటిని భక్తపాల దై
త్యాహితబృందవందితప♦దాంబుజ మేఘసమానవర్ణస
ద్దేహ త్రిలోకసుందర సు♦ధీమణి మోక్షఫలప్రదా జగ
న్మోహక నిత్యరూప హరి ♦ మోముకు జూపవె భక్తవత్సలా! ౪౬

ఉ॥ భారమె దీనబంధు పొర♦పాటున బిల్చితి నేర యంచు ని
ష్కారణమానె యేగతిని ♦ గల్పనజేయుచు హీనుడ స్సదా
నీరము పాలు చేయకుము ♦ నీరముజేయకు పాలు సంతతా
ధారము నీవె దుఃఖసము♦దాయము దుంపగ భక్తవత్సలా! ౪౭

ఉ॥ శ్రీరమణా యటంచు నుతి ♦ సేయనినోరగు బాడుబొంద దై
త్యారిచరిత్రముల్ వినుచు ♦ తిన్మయమందని మేను మ్రాను కం
సారిపదార్చనల్ సలుప♦జాలని చేతులు శుష్కశాఖ లా
శౌరికి మ్రొక్కలేని తల ♦ చట్టు యగున్సుమి భక్తవత్సలా! ౪౮

ఉ॥ సాధనచేత నిన్నెపుడు ♦ సన్నుతిజేయుచునుంటి రాఘవా
మోదముతోడ నిన్నెపుడు ♦ ముందుగ వేడితి మూలకారణా
భేదముగాను జూడకుము ♦ బెగ్గిలిగోరుచునుంటి నిన్ను నే
వేదననొందనీ కనుచు ♦ వేడుచునుంటిని భక్తవత్సలా! ౪౯

చ॥ అల సుధ ద్రావి మర్త్యుఁ డజ♦రామలభావము జెందు నొక్కఁడే
నలలితశైవకీర్తనము ♦ శంభుకథాశ్రవణంబుల న్వివి
శ్చలత నొనర్చు మానవుని ♦ సంతతికిం దనకుం దలంపగా
గలుగు సమస్తసౌఖ్యములు ♦ గాన ని దెచ్చగు భక్తవత్సలా! ౫౦

ఉ॥ ఏనరులైనగాని నిట♦లేక్షణ నిన్ను ననన్యదివ్యచి
త్తాన ప్రదోషకాలమున ♦ ధ్యానమొనర్చిన వార లెప్పుడుఙ్
పూనిక భోగభాగ్యచయ♦పుత్రకళత్రసుహృత్సమేతులై
దీనత నొందనట్టి సుగ♦తిం గనుచుందురు భక్తవత్సలా! ౫౧

చ॥ స్మరహర గంధధూపములు ♦ మానితగోఘృతదీపమాలికల్
సురుచిరభక్ష్యభోజ్యములు ♦ శుభ్రఫలాద్యమృతోపహారముల్
నిరుపమమంత్రపుష్పము ల♦నేకములైన ప్రదక్షిణంబులుఙ్
గురుతిడి వందనంబులును ♦ గోరి యొనర్చెద భక్తవత్సలా! ౫౨

చ॥ సతతము సర్వనాయకుని ♦ సన్నిధి సేవలు సేయు భాగ్య మీ
కతమున నాకు గల్గె నని ♦ కన్నుల జూచుచు సంతసింతు దు
ర్గతిగనబోవ నెప్పటికి ♦ గావున నాకను దోషనీడగా
జతపడియుండ వేడెదను ♦ సాధుజనావన భక్తవత్సలా! ౫3

ఉ॥ వేళయెఱింగి నన్నిపుడు ♦ వేగమె కాచెద వన్న యాసతో
చాలగ వేడుచుంటి నిను ♦ సన్మునివందిత మాధవప్రియా
జాలముసేయ కర్కశిఖి♦చంద్రసులోచన సోమశేఖరా
పాలనసేయు నన్నిలను ♦ బర్వతజాధిప భక్తవత్సలా! ౫౪

చ॥ ప్రమథగణాధిపా యనుచు ♦ ప్రార్థనజేసెద నిన్ను నే మదిఙ్
సమయమెఱింగి నన్నిపుడు ♦ సన్నిధి నిల్పుము భూతనాయకా
అమరులు నిన్ను నెంతు రని ♦ యందరు బల్కుదు రల్లె మూఢులుం
గ్రమముగ గొల్చి మించి రట ♦ గాదెననోమవె భక్తవత్సలా!

ఉ॥ పన్నగభూషణుండ నను ♦ బాలనసేయగ వేడుచున్న నీ
కన్నసుతుండ నన్నిపుడు ♦ గావకయుంటివె కామసంహారా

అన్నిటి కీవె యంచు నిను ♦ నాస్థ సదా భజియించుచుంటి నా
పన్నశరణ్య మృత్యుహర ♦ బాగుగ నమ్మచు భక్తవత్సలా! ౫౬

ఉ॥ శక్తియొసంగు నా కిపుడు ♦ శర్వుడ నీ శరణంబు గోరితిన్
ముక్తియొసంగువాడ వని ♦ ముందుగ నీచరితంబు వ్రాసితిన్
యుక్తిగ వ్రాయజాల దని ♦ యూరకయుండిన నెవ్వ రింక మా
భక్తియొసంగి నా కిపుడు ♦ బాగుగ బ్రోవుము భక్తవత్సలా! ౫౭

ఉ॥ అర్థము గూడబెట్టి యది ♦ యర్థుల కియ్యనిజన్మ జన్మమే
వ్యర్థము నేలజేసెద వ♦నర్థముగల్గునుగా పరోపకా
రార్థ మిదం శరీర మను ♦ న్యాయముజెప్పగ వింటి గాని జ
న్మార్థము లస్థిరంబు లని ♦ నా కిది జెప్పుము భక్తవత్సలా! ౫౮

ఉ॥ సృష్టిని మర్త్యకోటికిని ♦ జెప్పిన గన్పడకుండ నాజగత్
స్రష్ట లిఖించె పంక్తులను ♦ స్పష్టముగా నిజఫాలపాళి నే
తుష్టిగ నున్నకాలమున ♦ దోచిన నీ స్మరియింతురయ్యయో
కష్టము గల్గుచున్నపుడె ♦ కానరు నిన్నును భక్తవత్సలా! ౫౯

చ॥ దశరథరామ నీకృపకు ♦ దాసుడ నంచును దోసిలొగ్గితిన్
పశుపతివంద్య నిన్నొగడ ♦ బామరుడం దెలియంగజాల బో
దశదిశలం దెసంగుటను ♦ దప్పక కావుము దాసపోషకా
వశుడ నిట్లు నినుం గొలువ ♦ వచ్చితి నిప్పుడు భక్తవత్సలా! ౬౦

ఉ॥ రాముడె దేవవత్సలుడు ♦ రాముడె దైత్యహరుండు సంతతా
రాముడె యార్తరక్షకుడు ♦ రాముడె సర్వజగన్నుతుండు నా
రాముడె లోకశోభితుడు ♦ రాముడె భద్రినివాసి యంచు నా
రాముని నీవుగా మది ని♦రంతర మెంచెద భక్తవత్సలా! ౬౧

చ॥ కనులను గానలేక నిను ♦ గాఢముగా మనమందు నెప్పుడున్
మననము చేయుచుండెదను ♦ మాధవనామము దప్పకుండగా
ననయము నీదు సత్కథల ♦ నాడుచు బాడుచునుందు నయ్య నే
ఘనముగ నిన్ను నమ్మితిని ♦ గాన ముకుందుడ భక్తవత్సలా! ౬౨

ఉ॥ కారములేనికూర యుప♦కారములేని మనుష్యు డాది నోం
కారములేని మంత్రి మధి♦కారములేని నటేంపు వాక్చమ
త్కారములేని వేశ్య గుణ♦కారములేని మదింపుగా దిర
స్కారమునొందకుండ నను ♦ గావుమి యెల్లెడ భక్తవత్సలా! ౬౩

చ॥ పరమదయానిధే పతిత♦పావననామ మహాత్మ యంచు నే
వెరువక నిన్ను నెప్పుడును ♦ వేడుకతో మది గోరుచుంటిగా
అరమర లేల జేసెదవు ♦ యార్తశరణ్య యనుగ్రహింపు నన్
బరు డని యెంచబోకు మిక ♦ పాలన జేయుము భక్తవత్సలా!

ఉ॥ మాధవ నీదునామమును ♦ మానసమందున మానకుండెదన్
మోదముతోడ నీ కెపుడు ♦ మ్రొక్కుచునుండెద మూలకారణా
ఆదిమహానుభావుడవె ♦ యాశ్రితుడన్ నను నాదరింపుమీ
బాధల నొందనీక నను ♦ బాగుగ బ్రోవుము భక్తవత్సలా! ౬౫

ఉ॥ కారణ మేమి లేకయునె ♦ కన్నులజూడక యుంటి విట్లు నన్
వేఱుగ నెంచబోకు మిక ♦ వేమరు నిన్నును వేడికొంటి నో
తారకనామ నీస్మరణ ♦ తప్పక చేయుదు దానవాంతకా
భారమె నన్ను నేలు టది ♦ బాగుగ నెంచిన భక్తవత్సలా! ౬౬

ఉ॥ మోదముతోడ ని న్నెపుడు ♦ ముందుగవేడెద నామనంబునన్
ఖేదము నొందనీని వగు ♦ కృత్యము లప్పటియింపుచుండుమీ
వాదము లేల చేసెదవు ♦ వామనమూర్తిగ మోసపుచ్చగా
భేదము లెంచరాదుసుమి ♦ ప్రీతిని గన్గొను భక్తనత్సలా! ౬౭

చ॥ సవనఫలంబు నీవె యని ♦ సభ్యులు జెప్పగ వింటినయ్య నే
వివరముగాను నమ్మితిని ♦ వేడుకమీరగ నీచరిత్రముల్
అవనిని నన్ను బ్రోతు వని ♦ యందముగా నిను నే భజించుచున్
భువనమె నీదు రూప మని ♦ పొల్పుగజూచెద భక్తవత్సలా! ౬౮

ఉ॥ పండరినాథ నాహృదయ ♦ పద్మమునందు వసింపుమంచు నో
యండజవాహ స్వామి యని ♦ యాసను బిల్చిన మాఱుపల్కవా

తాండవకృష్ణ యేల పరి ♦ తాపము గొందవు జాలి లేద నీ
వుండ భయంబు గల్గ దని ♦ యొప్పుగ నెంతును భక్తవత్సలా! ౧౯

ఉ॥ శ్రీరఘునందనుండ తుల ♦ సీదళమాల్యధరుండ సుందరా
కారరమాధవుండ స్వర ♦ గానకళానిలయుండ దుష్టసం
హార సమర్థుడౌట ముని ♦ యాగము గాచిన బాలకుండవై
ధీరుని భార్గవుం గెలువ ♦ దేవుడవే యగు భక్తవత్సలా! ౨౦

ఉ॥ ముప్పదియారు తత్త్వములు ♦ ముక్తి నొసంగవు మూలకారణా
తప్పక చేయుదున్ భజన ♦ దాశరథీ దయయుంచు మంచు నే
నెప్పుడు నిన్ను గోరుకొని ♦ యేమర కుండెద నట్టులైన నా
తిప్పలనెల్ల నైచి నను ♦ ధన్యుని జేయుము భక్తవత్సలా! ౨౧

చ॥ పలుమరు వేడుచున్న నను ♦ బాగుగ జూడ విదేటి చిత్రమో
పలుక వదేల నే బిలువ ♦ బంతముకట్టకు సాటివాడ నా
చెలగుచు నాడుచున్ భజన ♦ చేయుచు చేతుల దట్టుచుండు ని
స్తులు డగు దాసుడ స్గనుక ♦ దోసము లెంచకు భక్తవత్సలా! ౨౨

ఉ॥ కొందరు గర్భదేశముల ♦ కొందరు సంభవమైన మాత్రనే
కొందరు యౌవనంబునను ♦ కొందరు వృద్ధులునై సనే లయం
బందుదు రెల్లమానవులు ♦ నంతకు పూర్వపుగర్మరీతులం
జెంది సుఖాసుఖంబులు బ్ర ♦ సిద్ధవిధం బిది భక్తవత్సలా! ౨౩

ఉ॥ గోపకుమార సీదయను ♦ గొబ్బున గోరితి నిమ్ము వేగమే
పాపము జేసినాడ నని ♦ బాధలు పెట్టకు మంచు వేడెదన్
తాపసవందనీయ నను ♦ దద్దయు బ్రీతిని గావు మంటి నే
గోపము చేయ కన్యుడన ♦ కోర్కెను దీర్పుము భక్తవత్సలా! ౨౪

ఉ॥ ఉల్లమునందు నిన్నెరుగ ♦ కూరక గొల్లలు నమ్మియుండగన్
చల్లయు పాలు వెన్న దధి ♦ చక్కెర మెక్కుచు నుంటివయ్య ని
న్నల్లరివాడ వంచు నొగి ♦ నందరు చెప్పుదు రయ్య కాని నీ
నల్లని ముద్దుమోము కన ♦ నవ్వుచు నుందురె భక్తవత్సలా! ౨౫

ఉ॥ శ్రీహరి దేవదేవ నిను ♦ జిత్తమునందును నమ్మి యుంటి నీ
మోహనరూపముం దలచి ♦ మోక్షము నొందఁ దలంచి పద్యముల్
సాహసవృత్తి వ్రాసితిని ♦ జక్కఁగనున్నను లేకయున్న ను
త్సాహముతోడ గైకొనఁగ ♦ దండము పెట్టెద భక్తవత్సలా! ౨౬

చ॥ మురహర నిన్ను నే దలచి ♦ ముందుగ వ్రాసితి నీదు స్తోత్రముల్
మరువకు నన్ను దాసుఁడను ♦ మాధవ నీమనమందు నెప్పుడున్
దరుణ మిదే యటంచు నిను ♦ దప్పక గొల్చుచు నున్నవాఁడ నన్
బరునిగ నెంచకుండు మిక ♦ బాలన జేయుము భక్తవత్సలా! ౨౭

ఉ॥ మాయమునుంగుచుండి యిల ♦ మానవులెల్లరు దాము తొల్త నీ
కాయము సుస్థిరంబని సు♦కాలము నంతయు వ్యర్థపుచ్చుచున్
హేయములైన కార్యముల ♦ నెన్నియొ చేయుచు నీదునామమే
ప్రాయమునందు నెన్న రిట ♦ బామరులౌటనె భక్తవత్సలా! ౨౮

చ॥ బిరుదువహించినాఁడ వట ♦ పేదలరక్షణ జేయుమేటి నన్
మరతువొ యేమొ దీనుఁడను ♦ మానవుఁడన్ గద మానసంబులో
బరు వని యెంచబోకు మని ♦ ప్రార్థనచేయుచు రామచంద్ర నిన్
దరుచుగ నెంచు దాసుఁడ ని♦దానముగాగను భక్తవత్సలా! ౨౯

ఉ॥ ఏమొనరించు నీ వనుచు ♦ నేలకె యుంట విదేటి చిత్రమో
కోమలగాత్ర నీమదిని ♦ కోపము నుంచకు మంచు వేఁడెదన్
వామనమూర్తి నీమహిమ ♦ వర్ణనసేయుట కెంతవాఁడ నన్
బ్రేమను నేలుమయ్య తగు ♦ ప్రీతిజనింపగ భక్తవత్సలా! ౩౦

ఉ॥ పక్షియె వాహనంబయి పెం♦పొసఁగ ముజ్జగముల్ భరింతు నీ
కుక్షి నజాండభాండములు ♦ కూడి యొసంగు నటంచు వింటి నీ
వక్షమునందు లక్ష్మియును ♦ వన్నెగ శోభిలునంట నాపయిం
గక్షవహింపబోకు మిక ♦ గావుము కావుము భక్తవత్సలా! ౩౧

ఉ॥ సుందరమూర్తి నీ వనుచు ♦ సొంపుగ నందరు మెచ్చుచుండ నీ
యందము జూచి మోహపడి ♦ యమ్మునిబృందము గోపికాళియై

చెందిరి నిన్నటంచు విన ♦ జిత్రముగా కథయొప్పునట్టులా
యిందును భక్తితో దగుదు ♦ నింపుగ నేలుము భక్తవత్సలా!

ఉ॥ అక్కట చుట్టమా గుహుడు♦హల్యయు గుబ్జయు దైత్యసూనుడున్
జక్కనిపాయసం బిడిరె ♦ సైచిన భూషలు గాన్క లిచ్చిరే
మక్కువమీఱ బ్రోచితివె ♦ మాధవ నే బగవాడనైతినా
నిక్కముగానె నిర్ధనుడ ♦ నీకగు దాసుడ భక్తవత్సలా! ౮౩

చ॥ పరమదయానిధే యనుచు ♦ భక్తిని నిన్నతతంబు వేడెదన్
సురనుత నాదు చిత్తమున ♦ జొచ్చి వసింపు మటంచు గోరెదన్
సరసగుణాభిరామ నిను ♦ సన్నుతిజేయుచు నున్నవాడ నన్
మరవక చేరదీయు మను♦మానము మానుము భక్తవత్సలా!

ఉ॥ ఎన్నివిధంబులైన విడ ♦ కెల్లెడ నిన్ స్మరియించి యెంచియున్
నున్నయటంచు రోయకయె ♦ సుందరమూర్తి త్వదీయరూపమున్
మన్నన జూచుచుంటి నిను ♦ మానసమందున మాధవప్రియా
సన్నలజాడలం దెలిసి ♦ చక్కగబ్రోవుము భక్తవత్సలా! ౮౫

చ॥ లసదసమానమూర్తిని ద♦లంచుచు నుంటిని దానవాంతకా
ముసలితనంబు వచ్చి నను ♦ మోసము నొందను ధ్యానదృష్టిలో
వసుమతి బుట్టినందులకు ♦ వాసిగ నీదరి జేరగల్గితిం
గసరుద మన్న నే విడువ ♦ గావకతప్పదు భక్తవత్సలా! ౮౬

ఉ॥ శ్రీవర భక్తపాల సుర♦సేవిత సన్మునిగానలోల యిం
దీవరలోచనా త్రిజగ♦దేకశరణ్య కృపాలవాల యో
దేవ యశోదబాల హరి ♦ దీనజనావన మమ్ము నేలగా
రావయ యోయి కృష్ణ బల♦రామసహోదర భక్తవత్సలా! ౮౭

చ॥ మరవను నిన్ను నే నెపుడు ♦ మానను నీపదపద్యగానముల్
వెరవను గాలుదూతలకు ♦ వేడుకగా మది నిన్ స్మరించెదన్
దొరవని నిన్ను నమ్మి కొలు♦తు న్నను దాసులలోన జేర్చుమా
పరమపవిత్ర నిన్ను నెడ♦బాయ నయో యిక భక్తవత్సలా! ౮౮

చ॥ ముదమున వేడుచుంటి నిక ♦ ముందుగ నన్ గృపజూడవయ్యయో
వదలను నిన్ను నే నెప్పుడు ♦ వాసవవందిత కోసలాధిపా
వెదకుచునుంటి ని న్నెపుడు వేడుకతో నను బ్రోవుమంటి నో
సదమల నిర్మలాత్మ నిను ♦ జక్కగ గోరితి భక్తవత్సలా! ౮౯

చ॥ కరిమొర యాలకించితివి ♦ గాచుటకేగద యట్టిరీతిగా
సరగున నాదు విన్నపము ♦ జక్కగ జేకొనుమయ్య రాఘవా
మరిమరి వేడుచుంటి నిక ♦ మానసమందున నుంచుకొమ్ము శ్రీ
హరనుత నీవె దిక్కగుచు ♦ నార్తుని బ్రోవుము భక్తవత్సలా! ౯౦

ఉ॥ అల్పుడనై జనించి భువి ♦ యందును నే బరకాంతగోష్ఠి వే
సల్పుచు నుంటి యీసరికి ♦ శాశ్వతమంచది యట్టిదుష్టసం
కల్పము మాన్పి నా బ్రతుకు ♦ గణ్యత నొందగ లట్టిమార్గముం
దెల్పుము నిన్ స్మరింతు జగ♦దీశ్వర కేశవ భక్తవత్సలా! ౯౧

ఉ॥ వేడుము రక్షకుం డెవడు ♦ వేగమె కన్గొని వానిచెంతనే
పాడుము రామకీర్తనలు ♦ పావనతం గన బేరుపొందగా
నాడుము సత్యవాక్యములు ♦ హాయిగ నుందువు వీడి బంధముల్
చూడుము మానసంబ యను♦చుం గతిజూపుము భక్తవత్సలా!

ఉ॥ ఎందరుదైవతంబుల య♦హీనమహత్త్వము విన్ననైన నీ
యందె మనంబు నిల్పు జను ♦ లందరికిన్ గడుముక్తినిచ్చు నీ
పొందును గూడ రమ్మనుచు ♦ బొల్పుగజేర్తువు వేదవేద్య నీ
వందటికంటె నెక్కుడని ♦ యాసపెనుంగొను భక్తవత్సలా! ౯౩

చ॥ అనవరతంబు మ్రొగ్గు నని ♦ యాగ్రహ మూనకు పార్థసారథీ
కనికర ముంచి నాగతిని ♦ కన్నులజూడు కృతాంతు డెప్డొ నా
పని యిక దీర్చ రమ్మనుచు ♦ ప్రాణములాగగ నున్నవా డయా
నను యముపోలి కంపకుము ♦ నామన విద్దియె భక్తవత్సలా! ౯౪

ఉ॥ అక్కట దిక్కునీవయిన ♦ నార్గురు చోరులు పట్టి రే మయా
నిక్క మెఱుంగనీరయిరె ♦ నీరజనాభ మదీయచిత్తమున్

జక్కఁగఁ జేయు మంటిని నిజంబుగ వీరిని వేగ ద్రుంచి నీ
యిక్కకుఁ జేర్చుమింతట దయానిధి శ్రీహరి భక్తవత్సలా! ౯౫

ఉ॥ అండజవాహ నీదయున • యండను జేరితి దండమయ్య కో
దండధరా రమారమణ • తాండవమాడుచు నాదువాక్కునం
దుండఁగ గోరుకొందును మ•హోన్నత నా వగు పాపకృత్యముల్
మెండని యెంచబోకు మిక • మేలొనగూర్పుము భక్తవత్సలా!

ఉ॥ అన్నియు బాసిపోవు దురి•తంబు లనేకములు న్నినుం గనన్
పన్నగశాయి నీచరణ•పంకజరేణువు సోకియేగదా
తిన్నగ నాతియయ్యె శిల • దేవమునీశ్వరపూజనీయ నీ
కన్న మఱెవ్వ రిట్టు ఘన•కార్య మొనర్తురు భక్తవత్సలా! ౯౭

ఉ॥ కోరికతీరె స్వాంతమున • కోమలదేహ భవత్కటాక్ష మే
కారణమయ్యె నేటి కన•గా నిక నీకృతి నీ కొసంగితిం
దారకనామ ధన్యుఁడను • దద్దయు నీఘరయందు నేర్పుగా
జేరఁగ నిమ్ము మీదరికి • శ్రీరఘునందన భక్తవత్సలా! ౯౮

చ॥ అఖిలము తానయై వెలుగు • యాపరమాత్ముఁడు పాదచారియై
సఖిసఖులందరి న్విడచి • చయ్యన యాబలిసంపదం గొనన్
సుఖముగ వచ్చుచుండె మధు•సూదనుఁడో యన దివ్యమైన నీ
ముఖము సురాసురుల్ గనుచు • మోదమునొందిరి భక్తవత్సలా!

చ॥ జయజయ రక్తబీజ దను•జాధిప శుంభనిశుంభమర్దనీ
జయజయ ఖడ్గఖేటశర•చాపగదాంకుశశూలధారిణీ
జయజయ భోగభాగ్యజయ • శాశ్వతభద్రఫలప్రదాయినీ
జయజయ యోగిమానసవ•శంకరి శాంకరి భక్తరక్షిణీ! ౧౦౦

ఉ॥ ఆదియుగంబునందు మహి•షాసురశుంభనిశుంభరక్తబీ
జాది సమస్తమర్మదని•శాటవిదారణ మాచరించి బ్ర
హ్మాదులు గొల్వ తాండవము • లాడిన శ్రీజగదంబ మమ్ము న
త్యాదృతి బ్రోచి నిత్యవిజ•యంబు లొసంగుము భక్తరక్షిణీ! ౧౦౧

చ॥ మనమున బూజయుం గొలుపు ♦ మానకజేయుదు నోమదంబ నిన్
ఘనముగ వేడుచున్న నను ♦ గావక యుంటి విదేటి చిత్రిమో
వినయముగాను బల్కుచును ♦ వేడుక సేవలు చేయుచుందు నీ
మనసున నుంచి ప్రోవు మిక ♦ మాధవసోదరి భక్తరక్షిణీ! ౧౦౨

చ॥ తెలిపెను నీ పరాక్రమము ♦ విందును గ్రంథములందు జూచితిన్
మఱువను నిన్ను నే నెపుడు ♦ మానసమందున నీ స్వరూపముం
దఱచుగ గాంతు నామములు ♦ ధ్యానమునం దిముడంగజేసి లో
బఱచికొనం దలంచెద గృపం గను దంచు నె భక్తరక్షిణీ! ౧౦౩

ఉ॥ ఏమియుజేయలేక భజి♦యించెద గొల్చెద సంస్తుతించెదన్
బ్రేమను నన్ను బ్రోవుమని ♦ బ్రీతిజనింపగ మ్రొక్కువాడ నో
కోమలగాత్రి నీకథల ♦ గోరుచునున్నవి నాచెవుల్ వినన్
నీమముపూని నామనసు ♦ నిన్నె తలంచెడి భక్తరక్షిణీ! ౧౦౪

ఉ॥ తల్లివి నీవె యంచిపుడు ♦ ధారుణిలో నిను నమ్మియుంటి నో
పల్లవపాణి మూఢుడను ♦ బాగుగ జూడుమటంచు వేడెదన్
గల్లలుగావు నన్నెపుడు ♦ గావుమటంటిసుమీ మదంబ నీ
చల్లని చూపులన్ని యెద♦జల్లుము నాపయి భక్తరక్షిణీ! ౧౦౫

చ॥ నఖజితమంజరీమహిత ♦ నమ్మిక నిన్నును గొల్చుచుందు స
మ్ముఖమున నుందువాడ నని ♦ పొందుగ గావుము నన్ను నెప్పుడున్
ముఖమును జూపి నన్నిపుడు ♦ మోదమునందగ జేయుమంటి నా
సుఖముగ నుండున ట్లికను♦శోభిలజేయుము భక్తరక్షిణీ! ౧౦౬

ఉ॥ ఆర్తశరణ్యుడైన ప్రియ♦ధాధిపుదివ్యకృపారసాన గం
దుర్తి వరాన్వయంబున బు♦ధుల్ రహి దీవన లీయ బట్టి స
త్కీర్తికి సజ్జనోపకృతి♦కి న్విరచించితి దీని నాగుణ
స్ఫూర్తి గ్రహించి దోషముల ♦ జొప్పడ నీయకు భక్తవత్సలా!

ఉ॥ కాయము తాల్పగాను శివ♦సంగను నాకొక నాయ నుండిన
న్నాయన పీవెయాదువని ♦ నమ్మిక మెల్లరకొప్ప నాదినా

రాయణుడన్న నామ మిడి ♦ రాముడె దిక్కని చిన్ననాట నే
న్యాయపుబోధచేయనగు ♦ నాశ్రితుడన్నుమి భక్తవత్సలా! ౧౦౮

సీ॥ జయభక్తసముదాయసంరక్షణోపాయ, జయకాలకూటభక్షణవినోద
జయవిష్ణుకాండకాంచనశైలకోదండ, జయపద్మజాండభాస్వత్ప్రచండ
జయశైలజాచిత్తజలజాతరోలంబ, జయరక్షితాపన్నజనకదంబ
జయజహ్నుకన్యకాశ్రియరమ్యతరజూట, జయజయహాల్లకసఖకిరీట
జయరజితభూధరాంచితస్థలనివాస, జయకృతాంతకమృత్యుభంజనవిలాస
జయవృషతురంగరాజీవశరవిభంగ, జయతుశివగంగపురవాసశంకరేశ.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# శ్రీ మహిషాసురమర్దనీ పంచరత్నస్తవం.

చ॥ నకనకలాడు కౌస్తుభక ♦ నవ్వుమొగంబున హస్తకంకణ
ప్రకటఝుణంఝుణల్ చెలగ ♦ బంగరువీణె ధరించి యింపుగా
సకలము బాడుచుంటి వని ♦ సంస్తుతిజేసెద నాదుపద్యముల్
ప్రకటనజేయు మంచు నిను ♦ బాగుగవేడెదనమ్మ భారతీ!

ఉ॥ శ్రీయుతనారదాదిముని♦బృందశరణ్యయు పుణ్యభక్తసం
స్థాయివిచింతితార్థదివి♦షన్మణియున్ వికచారుణాబ్జని
ర్యాయమనోజ్ఞపాణియు బు♦రాణియు నో జగదీశురాణి నా
రాయణి లోకశోకపరి♦హారిణి మాకు బ్రసన్న మయ్యెడిన్!

ఉ॥ బాల సుశీల సద్గుణ కృ♦పామతి శీల విశాలలోచనీ
పాలయ కల్మషఘ్ని పరి♦పాలయ మాం సుజనాత్మరూపిణీ
శూలిని సత్యరూప పరి♦శోభితమూర్తిని సర్వమంగళన్
చాలగ గొల్తునమ్మ మహి♦షాసురమర్దని శ్రీకపర్దినీ! ౧

ఉ॥ శ్రీపదముల్ బుధుల్ వినుతి ♦ సేయగ పర్వతరాజపుత్రి నీ
చూపులచేత గాచెదవు ♦ సొంపుగ వారి నుదారబుద్ధిచే
నేవిధినైన ముందుగను ♦ నేర్పడ జెప్పితి ధాత్రిలోన నా
పాప మడంచి బ్రోవు మహి♦షాసురమర్దని శ్రీకపర్దినీ! ౨

ఉ॥ పంకమునందు బొర్లుచును ♦ పాపమయం బగు కొండ నెక్కి ప
ర్యంక మిదే యటంచు మహి♦యందు దలంచుచు వెర్రినైతి హా
సంకట మెల్ల దీర్చి నను ♦ శాశ్వతమౌ పథమందు జేర్చుమా
శాంకరి నన్ క్షమించు మహి♦షాసురమర్దని శ్రీకపర్దనీ! 3

ఉ॥ ఏలితి వీజగత్రయము ♦ నేలుచునుంటివి చల్లపల్లి భూ
పాలుని సత్యశోభితుని ♦ పండితునిన్ శివరామభక్తునిన్
చాలగ మమ్ము నెల్లపుడు ♦ చక్కగ జూడుము నాదుతల్లిరో
జాలముసేయబోకు మహి♦షాసురమర్దని శ్రీకపర్దినీ! ౪

చ॥ కుమతుల గూల్చ బుట్టితివి ♦ క్రోధము పెంపుగ తొల్లి యియ్యెడన్
కమలముఖీ నిజంబు భవ♦సత్కథ వీనుల విందుజేసె వో
సుమతి పరాకె వేగ యిటు ♦ జూడుము బ్రోవుము మిన్నకుండకన్
సమయము నుద్వేచుంటి మహి♦షాసురమర్దని శ్రీకపర్దినీ! ౫

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# శ్రీ శాంకరీ పంచరత్నస్తవం.

ఉ॥ భ్రామరి నేను నీపయిని ♦ బాగుగ వ్రాసెద పంచరత్నముల్
సోమకళాధరీ యిపుడు ♦ సొంపుగ నుండిన నుండకుండినన్
వేమరు త్రోసివేయకుము ♦ వేడుచునుంటిని నిన్ను నామదిన్
కోమలగాత్రి నిన్నెపుడు ♦ కోరితి సద్గతి గల్గ జేయుమా.

ఉ॥ యుక్తిగ వ్రాసితి న్నిపుడు ♦ నూరకయుండక నేను పద్యముల్
రక్తిగ నుండలే దనక ♦ రంజిలజేయుము రక్తదంతికా
భక్తియొసంగు మంచు నిను ♦ బాగుగసన్నుతిజేతు భ్రామరీ
ముక్తిని నిచ్చుదాన వని ♦ ముందుగ గొల్చితినమ్మ శాంకరీ! ౧

ఉ॥ అంబ యటంచు నిన్నెపుడు ♦ నందముగా భజియించుచుండెదన్
శంభునిరాణి యంచు నిను ♦ సంతతమున్ స్మరియించుచుంటి శా
కంభరి దేవి యంచు నిను ♦ కాచుకయుంటిని తల్లి చండికా
అంబిక యంచు నుంటి నిపు ♦ డందముగా నను బ్రోవు శాంకరీ! ౨

ఉ॥ తల్లి శతాక్షివంచిపుడు ♦ తండ్రివి నీవె యటంచు వేడితిన్
కల్లలు గావు నాపలుకు ♦ గ్రంథములందున జూచి తిప్పుడున్
పల్లవపాణి హస్తములు ♦ బాగుగ నాలుగు యుండె నంచు నా
యుల్లమునందు నే నెపుడు ♦ యోర్పుతొ వేడుచుయుంటి శాంకరీ!

ఉ॥ పండుగలంచు నామదిలొ ♦ బాగుగ నిన్ స్మరియించుచుంటి నీ
యండను జేర్చుకొందు వని ♦ యాశతొ నుంటిని యోమదంబికా
దండిగ నిమ్మ సంపదలు ♦ తప్పక నీదరి జేర్చుకొమ్మ నీ
వుండ భయంబులే దనుచు ♦ నూరకయుంటిని తల్లి శాంకరీ! ౪

ఉ॥ వేదన నొందనీకు మని ♦ వేడుచు నుంటిని నిన్ను నెప్పుడున్
మోదముతోడ నీ కెపుడు ♦ మ్రొక్కుచునుంటిని మాలకారిణీ
భేదముగాను జూడకుము ♦ బెగ్గిలి నిన్నెద గోరుచుండెదన్
ఖేదమునొందనీక నిక ♦ కేవలమున్ స్తుతియింతు శాంకరీ! ౫

# చండికా అష్టకం ప్రారంభము.

ఉ॥ అంబ సమస్తలోక విను♦తాంబ పరాత్పరపాదపద్మరో
లంబ సుకింకిణీక్వణవి♦డంబ పురారి హృదబ్జకామకా
దంబ సువర్ణభూషితని♦తంబ త్రిలోకజనార్చితాన్నపూ
ర్ణాంబ సితాబ్జకంఠి జగ♦దంబ మదంబ స్మరింతు చండికా! ౧

ఉ॥ తల్లివటంచు నామదిలో ♦ తప్పక వేడుచునుంటి శాంకరీ
పల్లవపాణి ని న్మరువ ♦ పన్నగ భూషణురాణి వంచు నా
యుల్లమునందు నిన్గొలుతు ♦ యూరక యుండక నిన్ను గొల్చెదన్
చల్లనిచూపులన్ని వెద♦జల్లుము నాపయి దుర్గ చండికా! ౨

చ॥ కరములు మోడ్చి నిన్నెపుడు ♦ కన్నుల గాంచుచు నుందు శాం
కరీ మరువను నేను దాసుడను ♦ మాధవసోదరి మానసంబునన్
సరగున నన్ను బ్రోతువని ♦ సన్నుతి జేసెద నోమదంబికా
పురహరురాణి నీ కెపుడు ♦ బూజ యొనర్చెద దుర్గ చండికా! 3

ఉ॥ ముద్దులు గుల్కుచుండు నగు ♦ మోమిటు జూపుము మూలకారణీ
పొద్దున నిద్రలేచి నిను ♦ పొందుగ దల్చుచునుంటి తల్లి నీ
యొద్దనె యుండువాడ నని ♦ యొప్పుగ గోరుదు నోమదంబ నీ
హద్దును మీరకుండునటు ♦ లల్పునిగావుము దుర్గ చండికా! ౪

ఉ॥ కప్పురగంధి నన్నిపుడు ♦ కన్నులజూడ విదేటి చిత్రమో
మెప్పును జేయలేని కను ♦ మే లొనగూర్పుము తల్లి వేగమే
వొప్పులకుప్ప నీదయకు ♦ యోగ్యుడగానని యెంచబోకు నా
తప్పు క్షమించి నన్నికను ♦ ధన్యుని జేయుము దుర్గ చండికా! ౫

ఉ॥ పొందుగ నుండలే దనుచు ♦ బ్రోవక యుంటివ శంభురాణి నన్
యెందుకు జూడవీవు జగ♦దంబ యటంచును నిన్ను వేడెదన్
ముందుగ నిన్ను నామదిలో♦మోదము మీరగ మ్రొక్కుచుంటి నో
యిందుకళాధరీ యిపుడు ♦ నింపుగ నిన్ స్మరియింతు చండికా! ౬

ఉ॥ పూర్వభవాంతరంబులను ♦ బుణ్యము లెన్ని యొనర్చినాఁడనో
పర్వతకందరస్థలి ద♦పంబులు నేక్రియ సల్పి యుంటినో
సర్వసరిజ్జలంబుల భృ♦శంబుగ మజ్జనమాడియుంటి నో
శర్వనిరాజ్ఞి నిన్నిపుడు ♦ సన్నుతిజేసెద దుర్గ చండికా! ౭

ఉ॥ ఆదియుగంబునందు మహి♦షాసుర శుంభనిశుంభరక్త బీ
జాది సమస్త దుర్మదని♦శాటవిదారణ మాచరించి బ్ర
హ్మాదులు గొల్వ తాండవము ♦ లాడిన శ్రీజగదంబ మమ్ము న
త్యాదృతి బ్రోచి నిత్య విజ♦యంబు లొసంగుము దుర్గ చండికా! ౮

శ్లో॥ చండికాయాష్టకం పుణ్యం యః పఠే చ్ఛ్రద్ధమానసః
ఐహికాముష్మికం సౌఖ్యం లభతే నాత్ర సంశయః.

క॥ శ్రీరంజిల్లెడు శివగం,గా రమ్యాపురంబు నాకు ♦ గాపురమికనా
పేరే మనినం గౌరీ, నారీపతిభటుఁడ నాది♦నారాయణుఁడన్.

శ్రీ శ్రీ శ్రీ



# శ్రీరాములవారి నవరత్నమాల ప్రారంభము.

శా॥ శ్రీరామా రఘుపుంగవా దినమణీ ♦ సీతామనోవల్లభా
కారుణ్యాలయ దీనపోషక జగ♦త్కల్యాణమోక్షప్రదా
శూరా ధీరవిచారపండితముని♦స్తోత్రా పరంధామ హే
రారా యీశివగంగలో వెలయు శ్రీ♦రామా ననుం బ్రోవుమా.

మ॥ లలితాభాసుర దివ్యతేజమణిమా♦లాలంకృతా శోభితా
జలజాతేక్షణ మేఘవర్ణ సురర♦క్షా మానిసంసేవితా
ఫలదాయీ యఖిలాగమావినుత శ్రీ♦భక్తప్రియాలోల ని
ర్మలచిత్తా శివగంగలో వెలయు శ్రీ♦రామా ననుం బ్రోవుమా.

శా॥ ఈసారే కడసారి జన్మ యిదిగా ♦ నెంతు న్నిక న్మీదటన్
వేసారిల్లకు నన్ను గాచుటకు నీ ♦ వెట్లో సమర్థుండవే
సంసారాంబుధి దాట దెప్ప నిడగా ♦ సంతాపముల్ బాయుపే
రాసన్ యీశివగంగలో వెలయు శ్రీ♦రామా ననుం బ్రోవుమా.

మ॥ కరినిన్ గాచిన కన్నతండ్రి వని నా♦కర్ణంబులన్ సోకగా
దురితంబుల్ సమసె న్మదీయమదికిన్ ♦ దూరంబుగా బోకుమా
పరమాత్మా భవనామచింతనముచే ♦ బంధంబుల న్వీడు ని
ర్జరదేహా శివగంగలో వెలయు శ్రీ♦రామా ననున్ బ్రోవుమా.

శా॥ రావా బిల్చిన పల్కవా యెపుడు నన్ ♦ రక్షింపవా సర్వమున్
నీవే కావ ముదావహంబు మెరయన్ ♦ నీలోకలోకంబులో
దేవా కావవె దీనులం గనవె సం♦దేహించక న్వేగమే
రావోయీ శివగంగలో వెలయు శ్రీ♦రామా ననుం బ్రోవుమా.

శా॥ వ్రాయంజాలను పుణ్యపాప మచటం ♦ రక్షించ శిక్షించగా
జేయన్ దండధరుండు నుగ్రముగ నా♦చేత ల్మదిం జూచుచున్
జేయన్ లేరు సహాయ మొక్కరు గనన్ ♦ జేయ న్సమర్థుండవౌ
రా యన్నా శివగంగలో వెలయు శ్రీ♦రామా ననుం బ్రోవుమా.

మ॥ అరయన్ విద్యయుబుద్ధియున్ వినయమున్ జ్ఞానంబు శౌన్యంబుగా
బరగెన్ నానొనటన్ విధాతకర మొప్పారంగ యేమందు నే
వరదా నా కవి ఎట్లొసంగెదవొ నీవాడన్ కృపంజూడనొ
త్వరగన్ యీశివగంగలో వెలయు శ్రీరామా నను బ్రోవుమా!

శా॥ ఆయుశ్శ్రీబలమున్ యశస్సు భవదాజ్ఞాయత్తచిత్తంబు యీ
రేయి న్నాకడ జూపుమో యన మురారీ పద్యరత్నావళిన్
వేయ స్గంటెని మైదునాల్గు గొనుమా వేల్పుల్గొరా ధన్యుడన్
వ్రాయ న్నే శివగంగలో వెలయు శ్రీరామా నను బ్రోవుమా!

శా॥ కాలంబంతయు వ్యర్థకార్యములకై గాపించితిన్ యిత్తరిన్
యేలా పాలనజేతువో గద మదిన్ యేలాగునన్ జూతువో
లీలామానుషదేహ నాదుపలు కాలించంగ రక్షించి టాల్
రాలేవా శివగంగలో వెలయు శ్రీరామా నను బ్రోవుమా!

శ్లో॥ శ్రీరామనవరత్నాని యః పఠే త్సతతం నరః
సిద్ధ్యంతి సర్వకార్యాణి విష్ణులోకం స గచ్ఛతి.

శ్రీ శ్రీ శ్రీ



# నవరత్నమాల.



ఉ॥ నెయ్యము గాంచి బల్కఁగద • నేర్పుగ నెమ్మనమందు మీరు మా
కియ్యదలంచి నేడు నర• కేసరి యామనికొండ వంశ్యుడున్
యియ్యెడ నచ్చువేయుటకు • హెచ్చుగ నిచ్చెను యిద్దనంబు యా
బయ్యన శోభనాద్రి బల•భద్రసహోదర మీయశంబునన్.

ఉ॥ వేలుగ నాదుపే రదుగ • వేడ్కను శ్రీరఘురామచంద్ర యా
యేఁటను రెండు నొక్కటిగ • నన్నిటిప్రాసలయందు గూర్చి నా
పేరును గాన జెప్పితిని • బ్రీతిగ మత్స్యపురీనివాసుడన్
గోరుచునుంటి నీపదవి•కోసము నిన్నును భక్తవత్సలా! ౧

కం॥ శ్రీకుంతీసుతపాలుడు, వైకుంఠుడు సకలలోక•వంద్యుండు సదా
మాకుం గరుణాత్ముండై, శ్రీకరసంపదల నెపుడు • జేకూర్చు సదా.

చ॥ కదురదు మంచిభూమి సమ•కూడినవిత్తనమైన జెడ్డదౌ
నదునయినం జెడున్ సమత•నన్నియు గూడుట దుర్లభం బహో
వెదకగ నేల నేలయును • విత్తనముం బదును న్శుభంబులై
యెదుటను గానుపించె గోడు•వేమి పరాత్పరుదర్శనంబునన్. 3

ఉ॥ కీర్తియు వైభవంబు కృప•కిల్బిషబాహ్యత దానధర్మవి
స్ఫూర్తియు సత్యశౌచములు • పూర్తిగ మీయెడ నిల్చి భృత్యులై
వర్తిలుచున్న వంచనెడి • వార్తలె నమ్మితి రామచంద్ర కుం
దుర్తికులోద్భవుండ గొలు•తున్నిను నగ్గడ తేర్పు మొప్పుగాన్. ౪

శా॥ మాయాతీతుడు సర్వలోకవిభుడు•స్మర్తా ప్రార్థనీయుండు స్వ
చ్ఛాయాకల్పిత సర్వభూతచయ•రక్షాశిక్షణాధ్యక్షుడున్

శ్రీయాత్ముండు త్రిమూర్తిరూపుడు కృపా♦సింధుండు దుష్టాసురా
జేయానీకవిదారు డెల్లపుడు ర♦క్షించున్ మము న్సత్కృపన్. ౫

మ॥ పదిరూపంబుల దుష్టరాక్షసుల జం♦పం బుట్టె నెవ్వాడు ము
ప్పదిమూడ్కోట్ల నమర్త్యవర్యులకు దా♦ బ్రాపయ్యె నెవ్వాడు స్వ
ర్ణదికిన్ బ్రహ్మకు బుష్పసాయకునకుం♦దా దండ్రియౌ విష్ణు డా
త్రిదివేశేశశరణ్యు డిచ్చు సిరి ధా♦త్రిన్ మాకు నశ్రాంతమున్. ౬

కం॥ శ్రీనాథునికృపచేతను, జ్ఞానాధికుడైన నరుని ♦ చందము గన స
ద్దానాదికర్మములచే, నానాటికి బెరుగు మాకు ♦ నవ్యసుఖంబుల్.

కం॥ ఘోరాంధకారసదృశా, కారాజ్ఞాన మను పీడ ♦ గలిగిన మాకున్
శ్రీరాజ్ఞీశ్వరకరుణాం, భోరుహమిత్రాచ్ఛకరము♦ముదమొనరించున్.

ఉ॥ కాయకపోవు వృక్షము లొ♦కానొకనాటికినైన రాఘవా
జేయకపోవు నీకరుణ ♦ జెందిన దీనుడు శ్రీయుతుండుగా
బాయకపోవు పుణ్యములు ♦ పాపము లెప్పటికైన నెట్టులో
బాయనికీర్తిమాత్రమె ప్ర♦పంచమునన్ నను నందజేయుమా. ౯

కం॥ రణరంగభీమరామా, గుణ మిడు మబ్జాతనేత్ర గొలుతు న్నిన్నున్
దృణమాత్రమైనవారలకు, గణియింపక యిచ్చునట్టు♦గా జేయుమయా.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

భక్తవత్సలశతకమున్ను, నాయింటిపేరు నాపేరు గల ప్రాసాక్షర
ములతో వ్రాసిన నవరత్నమాల అనే తొమ్మిదిపద్యములున్ను
శ్రీ అమ్మవారి అనుగ్రహమువల్ల సంపూర్తి అయినవి.

శ్రీ పరమేశ్వరీ అర్పితం చాస్తు.

శ్రీ శ్రీ శ్రీ

# మా ప్రచురములు.

| | | | |
|---|---|---|---|
| దేవీపూజాదర్శము | ... | ... | 0—4—0. |
| శైవాగమోక్త శివార్చనక్రమము | ... | ... | 0—2—0. |
| యక్షగానము | ... | ... | 0—4—0. |

వలయువారు :—

కుందుర్తి ఆదినారాయణశర్మ,

శివగంగ అగ్రహారము,

మచిలీపట్టణము.